# తొలి పలుకు



## శ్రీ శ్రీ శ్రీ
## బూర్గుల రామకృష్ణారావు మహోదయులు
## ( కేరళ గవర్నరు )

ఈ జాతీయ గీతావళి సర్వులకు సులభముగా గ్రాహ్యమగునట్లు రచింపబడి రచయిత భావౌన్నత్యము వెలిబుచ్చినది. దేశప్రేమ జన్మహక్కుగా చాటుటలోను మఱియు భారతీమతల్లికి పుష్పాంజలు లర్పించుటలోను; ప్రేమ, విజ్ఞానము భారతీయ మనోవికాసమునకే కాక, సర్వ మానవ మానసిక చైతన్యమునకు మూలభూతము లని చాటుచున్నది.

శైలి సారళ్యమందేమి, పద గుంభనమందేమి, జన బాహుళ్యము యొక్క హృదయోద్దీపనమునకీ "జాతీయ భారతి" తోడ్పడుననుటలో నిసుమంతయు నతిశయోక్తి లేదు. ఇందుకు — సహకారము, భూదానము, ప్రపంచ రాజ్యము, ఆత్మ పరీక్ష — అను గీతములే తార్కాణములు.

కవితా ప్రియులును, రసజ్ఞులు నగు సహృదయులైన బుధజనుల యొక్కయే గాక తదితర సామాన్య ప్రజానీకముయొక్క మన్ననల నీ గీతావళి యందుకొనగలందులకై నా శుభాకాంక్ష లందజేయుచున్నాను.

తన కవితా సంపద నిట్లు మానవ సేవయందు సద్వినియోగము చేయుచున్న శ్రీ సుబ్బరామశాస్త్రి గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.



# కా వ్య ప రి చ య ము

## ఆ చా ర్య రం గా

(భారత శాసనసభా సభ్యులు)

"మీ మాటలె మంత్రంబులు"

శ్రీమతి భారతీదేవితో ఒక ఆంధ్ర యువతి అమ్మా! 'మాటలే మంత్రాలు' అని చెప్పివెళ్ళినారట! ఆనందడోలి కలలో ఊగుతూ శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గీతావళి గానం చేస్తూఉంటే పదే పదే ఆ మంచిమాట జ్ఞప్తికి వచ్చింది ఈ గీతావళిలోని ఆలోచనలన్నీ ఎటుకలో నున్నవే! యువక హృదయాల్లో-ఉత్సాహపూరిత గళాల్లో-నవ్వులొలికే పెదవుల్లో ఈనాడు కదలాడేవే! అయితేనేం? సుబ్బరామశాస్త్రి భారతికి నతిసేయుటతో - హృదయాన్ని, మాటలొలికించుకోవాలనే కుతూహలాన్ని నృత్యం చేయిస్తున్నె. వెలికివస్తున్న యీ మణి మంత్రాలు మన ద్వారా జాతిని ఉబ్బూచి నడిపిస్తామంటున్నె. ఈ పాటల 'తామరల కాంతిచ్ఛటలు' మన 'లోని వీణియను' పలికిస్తున్నె. అనుక్షణమూ మన మనస్సులలో మెలగుచున్న కోరికల కెంపటి అంద చందాలు వీరు తీర్చి దిద్దారో గమనిద్దాం:

ఉ ప ని ష ద్వా ణి

రామ రాజ్యం మాకు రావాలీ
వేద కేతన మెగుర వేయాలీ

పొట్ట నిండా కూడు
కట్ట నిండా బట్ట;
మేమనుభవింపగా
మిగిలినది యితరులకు
"పెద్ద చేతితో పిలిచి పెట్టాలీ
పెద్ద మన సనిపించు కోవాలీ"

ఇదే ఉపనిషత్తుల బోధకూడా. ఇదే యీనాటి ఎప్పటి మన శ్రేయం.

'విశ్వశాంతియే మన లక్ష్యం
విశ్వశ్రేయం మన ధ్యేయం' (ప్రపంచరాజ్యం)

ఆనాటినుండి యీనాటివఱకు "సర్వే జనాః సుఖినోభవంతు" అని అనుదినం మనంచేసే ప్రార్థనమును ప్రపంచాని కంతకూ పరమలక్ష్యంగా బోధగా వెల్గుచున్నదానిని సుబ్బరామ శాస్త్రిగారు యీనాటి మణిమంత్రంగా జపిస్తున్నారు.

## భారతధర్మ పునఃప్రవచనం

ఎందరెందరితోనో మనదేశ ప్రజలం స్నేహం సంపాదిస్తున్నాం. అందరితోనూ స్నేహసంపదను మనం పెంపొందించుకోవలసి వుంది. అయినా కొందరిపై ప్రత్యేకాభిమానం కలుగుతుంది; సకారణంగానే! ఆ కారణం సర్వజన శ్రేయోదాయకంగా వుండాలి. అప్పుడే అది సర్వశ్రేష్ఠమవుతుంది.

"చరిత్ర మొదలుగ సరిహద్దగు ఇరు
జాతుల కెన్నడు ఘర్షణలేదని"—
కలిసి కట్టుగా తొలిగా మనతో
పంచశీల ప్రేమించి నిలచెనని"

సోదర చైనాను ఆదరిద్దామన్నారు. ఇక జాగృతి చెప్పు చున్నారు ఆసియానుగురించి :

"వలస పద్ధతికి ప్రబల విరోధి
అణ్వాయుధముల కామడ దూరం"

కనుకనే సుబ్బరామశాస్త్రిగారి హెచ్చరిక ఎంత బలమైనదో వినండి; మన 'భారతి'యై పల్కే, వారి భారతికి చెవి యొగ్గుదాం.

"హద్దు తప్పి నడుచు
హక్కు నీకెక్కడిది?
యుద్ధాలు రెండైన
బుద్ధి లేదేరా!
హిరోషి మా నగర
ఘోరమ్ము కన్నావు
మారణాస్త్రము పైన
మనసు విడవేలా" (శాంతి సందేశము)

అంటూ ఆనాటి తిక్కన కృపాచార్యునిచే అశ్వత్థామకు చెప్పించిన ధర్మాన్ని శ్రీ సుబ్బరామశాస్త్రి పునః ప్రవచిస్తు న్నారు.

## దేశాభిమానం

మన దేశంపై నిజంగా మన కెంతో అభిమానమ్రుం టుంది; ప్రపంచమంతటా ఇదే సత్యం వర్తిస్తుంది. అయితే యీ కవీశ్వరుని సవాలెంతగా ఉన్నదో చూడండి ప్రతి దేశ భక్తునకు ?

"పుట్టినావే భరత దేశాన-చేత
పట్టినావా? గీత ఎప్పుడైన"

అలాగే రామాయణ మ్మెంత చదివావు? భారతం సగమైన చూశావ? భాగవత శుశ్రూష చేశావ? అంటూ మన సంస్కృతి, కవిత, చరితలపై ఎంత మమకారాన్ని కలి గిస్తున్నారు!

ఇంత దేశము ఒక్కటిగానే ఉండాలి, కలిసి కట్టుగా ప్రజలందరు ఒకటి కావాలి; కనుకనే "ఒక్క చూపుతోడ దేశ మొక్క త్రాటలాగిన" భారత సర్దారును ప్రేమిస్తునారు. "కరుణ పొంగి పొరలి పొరలి పరమమార్గ మెది యెది యని తరచి తరచి కనుగొన్న" బుద్ధుని పూజిస్తున్నారు. ఆయన కరుణామార్గమును (పంచశీల) దేశమ్ములపద్ధతిగా తీర్చుచున్న శ్రీ జవహరును లాలిస్తున్నారు.

## యుగ యుగ బంధం

"వఱదలైన త్యాగంలో
దొరకెను స్వాతంత్ర్య ఫలము"

నర నరాల సడలించిన
తర తరాల దాస్యమ్మే
మరచిపోయి యీ నాడూ
పిరి పీల్చితి మెంత స్వేచ్ఛ"

అంటూ యీనాటి మాబోటి జాతీయవీరుల ఆనందాన్ని భవిష్యత్ యుగాలవారికి అందిస్తున్నారు. ఆ 1920 నుండి యిప్పటివరకు మహాత్ముని అడుగుజాడలలో నడువ ప్రయత్నిస్తున్న మాలాటివారి అందరి జీవితములను ఆనాటి గోపికా గణ తోరణంగా కూర్చిన సుబ్బరామశాస్త్రిగారికి మేం కృతజ్ఞులం.

నీ పలుకే బంగారమై
నీ పిలుపే సింగారమై
సివమెత్తిరి జనము మురళి
రవము విన్న గోపికలై —

అనేసరికి వేల సంవత్సరాల కధలు ఆనాటివి యీనాటివి ఒక్క తృటిలో ఒక్కనాటి కథగా రూపొందుతూ ఉన్నై.

## విశాలాంధ్ర మహోదయం

ఆంధ్రు లీనాటినుండి విశాలాంధ్రలో — ఆనాటి నాగమాంబ రుద్రమదేవి రాయలును; ఎప్పుడో సముద్ర తరంగాలపై తేలిపోతూ ఎన్నెన్నో దేశాలలో విజ్ఞాన జ్యోతుల వెల్గించిన శాతవాహనులు, విష్ణు కుండినులు, పల్లవులు —

భారతమాతపై చల్లని చూపులు ప్రసరించి ఆశీర్వదించడానికి శ్రీ సుబ్బరామశాస్త్రివంటి కవులు తమ "నరాల సత్తువ"ను 'విశ్వభారతి' నుండి 'ఆంధ్రభారతి'కి ఎన్నెన్నో "జాతి రత్నము"ల నేర్చి కూర్చగలరు.

ఈ విశాలాంధ్రావతరణ శుభసమయంలో ఇంతటి కమ్మని కవనాన్ని యీ గీతావళిరూపంలో మన కందిస్తున్న శ్రీ సుబ్బరామ కవీంద్రున కివే నా నమో వాకములు, శుభాశీస్సులు.

(1—11—56 వాహిని)



శ్రీ నీలం సంజీవరెడ్డి
(ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి - ఉస్మానియా ఛాన్సెలర్)

మీరు అందజేసిన జాతీయ గీతములు రైలులోనే చదివాను. చాలా బాగున్నాయి. అందులో కొన్ని గీతాలు మిక్కిలి భావగర్భితంగా నున్నాయి.

శ్రీ బెజవాడ గోపాలరెడ్డి
ప్రో ఛాన్సలర్ ఆంధ్రా యూనివర్శిటీ.
(ఆంధ్రప్రదేశ ప్రభుత్వ దేశవ్యవహార మంత్రి)

మీరు దయతో పంపిన 'జాతీయ భారతి' ని శ్రద్ధగ పఠించితిని. ఉద్రేకపూరితములు నుల్లాసభరితములయిన మీ గీతములు మధురకంఠమున సుస్వరమున పలికించిన అత్యధికానందమును పొందగలము.

ఇట్టి కావ్యమును ఆంధ్ర సహృదయుల కందిచ్చిన మీకు నా ధన్యవాదములు.

శ్రీ కళా వెంకటరావు
(ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ ఆర్థికశాఖామాత్యులు)

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు రచియించిన గీతావళిని చూచితిని. ఇందులో కొన్ని చిరకాలమునుండి పలు ప్రదేశములలో చెవుల కింపుగా వినబడుచున్న గీతములే—

'త్రిలింగ దేశం మన దేనోయ్
తెలుంగు లంటే మనమేనోయ్'

చాలా ఉత్తమస్థాయిలో వ్రాయబడినది. శ్రీ శాస్త్రిగారి కవితను హృదయమునుండి వచ్చిన జాతీయ భావముల వెల్లువగనే పరిగణింప వలసియున్నది.

గేయములన్నియు సరళమగు భాషలో వ్రాయబడినవి.

"రామ రాజ్యం మాకు రావాలీ
వేద కేతన మెగుర వేయాలీ"

ఈ భావములతో నిండిన యీ పుస్తకమును రచించిన శ్రీ శాస్త్రిగారు అభినందనీయులు. ఆంధ్రులు వారికి కృతజ్ఞులు.

శ్రీ కల్లూరి చంద్రమౌళి
(ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ్యులు)

భౌతిక సంపదను సంస్కృతీ వికాసమును సమన్వయించి విశాల దృక్కుతో ఉన్న తాశయముల నుత్కృష్ట భావముల వెలార్చు మీ జాతీయగీతములు భారత మాతను సౌష్టవముగ వర్ధిల్ల చేయుటకు పూర్తి దోహద మొసంగుచున్నవి.

అన్నపూర్ణగా ఆధ్యాత్మిక జ్యోతిగా ప్రాచీన కాలము నుండియు ప్రఖ్యాతినంది విశ్వమానవశాంతి కల్యాణమును చేకూర్చిన భారతి నేడు సమగ్రముగను సంపూర్ణముగను స్వీయ ధర్మనిర్వహణమును చేయుటకు తెలుగు నాట మీ గీతికలు మధుర మధురముగ నిక్వణించుగాక !

ఆచార్య
శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య,
(*Retired Professor of Politics*
*Univesity of Bombay.*)

ఆధునిక కాలమున ప్రపంచమందు శాంతిస్థాపనమునకు భారతీయులు చేయదగిన కృషి ఎట్టిదో శాస్త్రిగారి జాతీయతాభిమానము ఎంతటి పవిత్రమైనదో వారి జాతీయ గీతముల సంపుటి స్పష్టపరచుచున్నది. వారిది మధుర గంభీరమైన కవిత్వము. ఇట్టి కృషి సర్వవిధముల కొనియాడదగినది.

శ్రీ తెన్నేటి విశ్వనాథం

న్యూ ఢిల్లీ.

*Chairman, Advisory Commission,*
(Company Law Admn)

I am glad to go through your book of songs. Some of them are really inspiring. Now a days, Songs and Music have become purposeful, not merely pleasing the emotions but serving a definite social end. I do not know how far these two objectives can be kept mutually exclusive. So long as they are kept exclusive, I beleive both will suffer.

The real poet strikes a happy blend and balance of both and creates a world in which realism and idealism will happily blend together giving pleasure as well as serving a purpose. I have no doubt your songs collected in this booklet are in that desirable direction.

శ్రీ కోటంరాజు రామారావు

భారతప్రభుత్వ సమాచారశాఖ, న్యూఢిల్లీ.

*Advisor to the Indian Govt,*
*Five Years Plan Publicity.*

Thank you for your book of poems. I would suggest that if you want to get the full value for this book from the point of view of public service, it should be sent to the Educational authorities of Andhra.

పద్మవిభూషణ, ఆంధ్ర పితామహ

డా॥ మాడపాటి హనుమంతరావు

తమ జాతీయభారతిని ఆమూలాగ్రముగ చదివి మిక్కిలి ఆనందించితిని. గేయములు విజ్ఞానప్రదములై మనోజ్ఞములుగ నున్నవి.

మంచి కాగితముపై ముద్దులొలుకునట్లు ముద్రింపబడిన మీ పుస్తకము ఆంధ్ర యువజనుల కాహ్లాదముకలిగించి, వారి హృదయమునందు రాష్ట్రభావమును పెంపొందింప చేయగలదు.

నన్ను తమ పుస్తకమునుగూర్చి యభిప్రాయము నొసగగల వానిగా భావించి నన్ననుగ్రహించిన మీకు కృతజ్ఞుడను.

# ఆంధ్ర జాతీయ గీతము

## అభిప్రాయములు :

### శ్రీ పి. వి. రాజమన్నారు,

అఖిల భారత సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు :
మదరాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులు

ఉత్తమ జాతీయ గీతానికి ఉండవలసిన లక్షణాలన్నీ దీనికి ఉన్నవి. సులభశైలి, సొంపైన లయ, ఉత్సాహపూరితమైన భావాలు, జాత్యభిమానము జాతీయగర్వము, ఆంధ్ర దేశాని కిది తగిన జాతీయ గీతము.

### శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారు

సభాపతులు : భారత లోక్ సభ

మృదు మధురశైలిలో సులభ గ్రాహ్యమై ప్రతి పాదమునందును ఆంధ్రౌన్నత్యమును స్మరణకు తెచ్చుచున్నది. దీనిని పాడువారును వినువారును దేశభక్తి ప్రపూరితులు కాక తప్పదు. ఆంధ్రదేశమునకు దీనిని జాతీయ గీతముగా అంగీకరించుటకు తగియున్నది.

కీర్తిశేషులు

### దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్య

జాతీయ గీతము పాడుటకు సుకరముగను మధురముగను భావపూరితముగను నున్నది. ఎక్కువ గణనీయమని నా అభిప్రాయము.

కీర్తిశేషులు

## బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

( మద్రాసు ప్రభుత్వ ప్రథమాంధ్రాస్థాన కవి )

ఆంధ్ర జాతీయ గీతముగా శ్రీ సుబ్బరామశాస్త్రిగారు రచించిన 'త్రిలింగదేశం మనదేనోయ్' అనే గేయము నేను విన్నాను. ఆంధ్రదేశానికి జాతీయ గీతం గా మద్రాసు ప్రభుత్వం నిర్ణయించగలదని తలుస్తాను.

*Late*

## SRI V. N. BHUSHAN,

(*Principal Bhavan's College Andheri, Bombay*)

I have read the Poem with great interest and Co-ngratulate you upon its production. It is both instructive and inspiring,

Sriman

## N. C. NARASIMHACHARYA, B.A., LL. B.,

*Latmichend House,*

Matunga, BOMBAY-19

28—12—'49.

Its flowing melody and the spirit animating it are really commendable. I hope not only it will ring throughout the country but it will take its place as the only national song dear to those whose eminence it preaches from begining to the end.





రవికవి భారతి వలె, భారత స్వాతంత్ర్య సంపాదనమునకు పూర్వముచేసిన జాతీయతాధర్మప్రబోధమే - తొలిగా శబ్దించిన ఆటుగేయములును.

స్వతంత్ర భారతమును దర్శించుకొను అదృష్టమా మహనీయులకు కల్గినదికాదు. నవభారత నిర్మాణార్ధమైన హావిస్సు, నేటి యీ నా కవితా తపస్సు.

రాచరికము ప్రజలకు సంక్రమించగా - వారికి ప్రతినిధులైనవారే - నేటి ప్రభువులు. ధర్మమే రాజ్య సుస్థితికి మూలాధారము. కాగా యీ నా ప్రవచించిన జాతీయతా ధర్మము రాజధర్మమయినది. అభిప్రాయము లధికముగ సేకరించుటలోని వివరణ మిక అనపేక్షితము.

పంచ భాషా కోవిదులు తమ తొలిపలుకులో జాతీయతా ధర్మమును సూత్రీకరించిరి.

కావ్య పరిచయముతో భాష్యము వెలువడినది.

మిగిలినవి తద్వ్యాఖ్యలు.

సహృదయమైన రాచరికమున కివే నా నమోవాకములు.

స్వస్తి.

సుబ్బరామశాస్త్రి



# జన్మ హక్కు

శ్రీ ఖండమును సువా
సించు భారతభూమి
నీ జన్మహక్కురా
నీ జీవగడ్డరా

పాడుకోరా పురా
ప్రభ మూడు వేళలా
వేడుకోరా నేడె
వేలుపుల ముక్తికై.



# గమ్యం

రామరాజ్యం మాకు
రావాలీ
వేద కేతన మెగుర
వేయాలీ.

పొట్టనిండా కూడు
కట్టనిండా బట్ట
మే మనుభవింపగా
మిగిలినది యితరులకు

పెద్ద చేతితో పిలిచి పెట్టాలీ
పెద్ద మన సనిపించుకోవాలీ.



## పి లు పు

కమమూసెనా భరత
ఖండ ప్రభావాలు
భారతీయుడ యిల్లు
చేరచేదా పిలుపు

పట్టపగటీ నిదుర లేరా
పిట్ట పిడుగూ వోలె రారా

ఆదికవి వాల్మీకి
అమృత ప్రవాహాలు
కృష్ణయ్య చిందినా
గీతా ప్రబోధాలు

మావేను మావేను అనవేరా
లేవేమి మీకేమి అనవేరా ॥ క ॥

మా భరత మాతృ కం
ఠా భరణమై వెల్గు
కాళిదాసుని వంటి
కవి యసలె లేడంచు

హుంకార మొనరించి అనవేరా
ఢంకా బజాయించి అనవేరా ॥ క ॥

అంభోధి పుడిసింట
ఆచమించిన దిట్ట
కుంభ సంభవుడు మా
గుడికట్టు వాడంచు

ఎలుగెత్తి ఎలుగెత్తి అనవేరా
కలగుండు వడువారి కనవేరా ॥ క ॥

'అన్య మింద్రం కరి
ష్యామి' అన్న మహర్షి
గాధేయుతో పోలి
కను చూపగలవె యని

ఎదురుపడి కదలించి యనవేరా
బెదరు వదనము వారి కనవేరా ॥ క ॥



# జోహారు

మా నేలపై లేని
మత మసలె లేదు ;
మా మతములో చాలు
మత మసలె లేదు—

ఆది సముద్రము, జీవ
నదులె అన్నియును
కమలసంభవు అను
గ్రహము మా మతము—

మా ఋషులుదివ్య ప్ర
భావైక ధనులు;
మా మునులు లోకసం
గ్రహణార్థనిధులు.

అరటి పండొలచి నటు

లందించినారు;

శ్రుతిధర్మములను వి

స్తృతముగను స్మృతుల—

భారతాంబా నీకు జోహారు

జ్ఞాన దాత్రీ నీకు జోహారు

వీరమాతా నీకు జోహారు

అమృతవల్లీ నీకు జోహారు

కన్నతల్లికి నీకు జోహారు

వెన్నెల్ల చూపులకు జోహారు.



## రైతు

రైతురా సోదరా
రాజ్యమ్ము వెన్నెముక
రైతు కనుకోస నీ
రాజనము వెలగాలి

అజ్ఞాన తిమిరమ్ము
లంతరించాలీ
విజ్ఞాన భాస్కరుడు
వెలుగు నించాలీ___

అతని నాగలికఱ్ఱు
ఐశ్వర్యముల మిఱ్ఱు
అతని కొడవలి హస్త
తలపు భాగ్యపు రేఖ...రై...

పురుగనక పుట్రనక
వఱదనక వాననక
కష్టించు మన పంట
కాపు వర్ధిల్లాలి...రై...

# ఆంధ్ర జాతీయ గీతము

త్రిలింగదేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్...

మధురం మధురం మధురం మధురం
ఆంధ్రమ్మంటే అతిమధురం...
దేశభాషలా తీరుల్లోకి
ఆంధ్రమ్మంటే అతిమధురం...—

రాయలు మనవాడోయ్ – పండిత
రాయలు మనవాడోయ్
కలంతిక్కనా ఖడ్గతిక్కనా
గణపతిదేవులు మనవారోయ్...

అమరావతి నాగార్జునకొండా
సిద్ధహస్తులా శిల్పాలోయ్

మల్లినాథ కుమారిలభట్టులు
అందెవేసినా హస్తాలోయ్...

గోదావరి కృష్ణా
తుంగభద్ర పెన్నా
కనిపెంచినవోయ్ తెలుంగుజాతిని
వినిపించినవోయ్ వీణానాదం...

ఓడలు కట్టేమూ - మింటికి
మేడలు కట్టాము
మున్నీరంతా ఏకరాశిగా
ముద్దరవేశామూ...

సంతలలో వజ్రాల రాసులూ
జెలజెల లాడినవీ
కుబేరతుల్యం మహదైశ్వర్యం
గొడుగు పట్టినాదీ...

కలకలలాడే తెలుంగుదేవికి
గంధాగురుధూపం ;
కిలకిలలాడే తెలుంగుకన్నెల
కిన్నెరలాలాపం ;
బలం గడించీ వెలుంగునించే
తెలుంగుజండా 'హుం'
తెలుంగుభేరి 'ధాం'
గణగణ గణగణ
గణగణ గణగణ
తెలుంగు జయఘంటా ;
గణగణా గణాగణ
గణా గణా గణ
తెలుంగు జయఘంటా......త్రి॥



# నై - నైజాం

( తెల్లవారి దొరతనపు రోజులలో డాక్టరు లంక సుందరంగారు బ్రిటిషుప్రభుత్వము బందరురేవును నైజాముకు అమ్మివేయునను రహస్య సమాచారము బైట పెట్టగా డా॥ పట్టాభిగారు ధ్రువపరచిరి )

అమ్ముడు పోతున్నామా
ఆంధ్రుల
మమ్ముడు పోతున్నామా
నిజాము పీటికి
బజారు రేటుకు
అమ్ముడుపోతున్నామా!

చేపల్లా
జెల్లల్లా
కొవ్విబలిసినా
గొఱ్ఱెల్లా____॥ అ ॥

కోయిల కూస్తుందా? యింకా
వాయువు వీస్తుందా

జులుము హుకుములో
తెలుగు జీవులకు
వెలుగు పోకుతుందా ? ॥ అ॥

నడుం కట్ట రండీ – ఎప్పుడో
బుడుంగు మంటుందీ
ప్రతిపాదనలో ఉన్నదానినే
ప్రతిఘటించరండీ
ఆంధ్రులు
ప్రతిఘటించ రండీ—
అమ్ముడు పోతామా
ఆంధ్రుల
మమ్ముడు పోతామా ?
కల్ల, అబద్ధం, ఝూటా – మమ్మ
ల్నమ్మే దెవరండీ ?—॥ అ॥



# నా దేశం

నాదేశం నాదేశం
భారతదేశం నాదేశం

జగద్గురువు శృంగేరి శంకరుడు
జగత్కవీశుడు వాల్మీకి
జగదుద్ధారము కృష్ణ మహాత్ము
జగదాదర్శము రామచంద్రుడు

కొలువు తీర్చినా నాదేశం
వెలుగు నించినా నాదేశం॥

జగదున్నతాలము హిమాలయమ్ము
జగత్పవిత్రము గంగాతోయము
జగత్పండితుడు జగన్నాధుడు
జగమెరిగిన శిబి దానవీరుడూ

నాదేశము లోపి
నాదేశము వారూ॥



కాశ్మీరము మనదీ
కోలారూ మనదీ
గయా ప్రయాగా
కాశీక్షేత్రం
బృందావనమూ
బ్రహ్మకపాలం

నా దేశపు
నిధులూ
నా దేశపు
తపసూ॥

కనకదుర్గ కల
కత్తా కాళీ
కామాక్షీ
మీనాక్షీ

అన్నపూర్ణ వా
రణాసిమాతా

ఉగ్గుపట్టి నా
నా దేశం

నిగ్గుతేరినా
నా దేశం.॥





తొలిదొరవు నీవే _ సు

భాసు బాబూ!

తొలిసైన్యం నీదె - సు

భాసుబాబూ ॥

# నే తా జీ

మేటి వీరుడా! నీ
సాటి ఎవరురా!
వీరుడా!
ధీరుడా!
బోసుబాబు—

నిన్ను కన్న వంగభూమి
వన్నె కెక్కెరా!
నిన్ను కన్న భరతమాత
మిన్ను ముట్టెరా! ॥ మే॥

తొలిదొరవూ నీవే – సు
బాసు బాబూ!
తొలిసైన్యం నీదే – సె
బాసు బాబూ ॥ మే॥

మున్నీరా కన్నీరూ
నిన్ను తలచినా—
నిన్ను మరచి మనలే మో
మా నేతాజీ ॥ మే ॥





కర్పూరమైన నీ బ్రతుకుకు
కర్పూరపు హారతు లెత్తిరి
తెలుగుజాతి నీ పేరిట
వెలిగించును తెలుగు జ్యోతి॥

# అ మ ర జీ వి

అస్తమించినావా!
అమరజీవి! శ్రీరామా!
తరుణదేహ యష్టి వ్రేల్చి
నిరశ నాగ్ని గుండంలో ॥ అ ॥

కపురమైన నీ బ్రతుకుకు
కపురారతు లెత్తినారు
తెలుగుజాతి నీ పేరున
వెలిగించును తెలుగుజ్యోతి ॥ అ ॥

భరతజాతి నీకోసం
పొరలి పొరలి శోకించెను
కరగిపోయె జవహరులాల్
పరమమూర్తి, నీ మృతి విని ॥ అ ॥

వెల్లివిరిసె నీ త్యాగం
తల్లడిల్లె ఢిల్లీ పురి—
గాంధిగురువు వెల్గించిన
ఇంధనమా! జోహారు!





ఏ మహిమే కొల్లాయా

ఏ మెఱుగే బ్రహ్మాండం

కత్తిలేక సేనలేక

ఎత్తినావు జయపతాక ॥

# జాతి పిత

జాతి పితా గాంధీ!
నరజాతి పితా గాంధీ!
జాతిపిత గాంధీ!
నరజాతి పితా గాంధీ!

వీతెంచిన పరిమళమై
తో తెచ్చిన స్వాతంత్ర్యం
బుగుల్కొల్పె భరతజాతి
రగుల్కొల్పె సత్యాగ్నిని ॥ జా ॥

నీ వలువే కొల్లాయీ
నీ వెలుగే బ్రహ్మాండం
కత్తిలేక సేనలేక
ఎత్తినావు జయపతాక ॥ జా ॥



నీ-పలుకే బంగారమై
పిలుపే సింగారమై
సివమెత్తిరి జనము మురళి
రవము విన్న గోపికలై ॥ జా ॥





పరిమళించె విశ్వంభర
పరవశమై నీ జనితో
భరతఖండ కీర్తిధునీ
పరమయోగి! ప్రాగ్జ్యోతి॥

# బుద్ధుడు

సిద్ధమూర్తి !
శౌద్ధోదని !
సిద్ధార్థా !
బుద్ధయమీ !

జోహారు జోహారు
జోహారు జోహారు॥

అర్ధాంగిని కన్నసుతుని
అర్ధరాత్రి వదలి కదలి
అంతఃపురమును దాటిన
అంతస్సే త్యాగమయము॥

నరుని జరయు రుజ చూచిన
కరుణ పొంగి పొరలి పొరలి
పరమ మార్గ మెది మెది యని
తరచి తరచి కనుగొంటివి॥

పరిమళించె విశ్వంభర
పరవశమై నీ జనితో
భరతఖండ కీర్తి ధునీ!
పరమ యోగి! ప్రాగ్జ్యోతీ!



# స్వేచ్ఛా భారతం

ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు!
కన్నా మీ స్వాతంత్ర్యం!
అన్నన్నా! యీనాడే
పున్నమలోక వేయి వెలుగు ॥ ఎ॥

పదిలపడెను గుండె నేడు
పదునైదవ ఆగస్టా!
పది తొమ్మిది వందల నల్
బది యేడవ వత్సరమ్మ ॥ ఎ॥

భరతమాత పుత్రులార!
పరమ తపోధనులారా!
అర్ధరాత్రి మేల్కాంటిమి
సార్థక మీ స్వాతంత్ర్యం ॥ ఎ॥

నర నరాల సడలించిన
తర తరాల దాస్యమ్మే
మఱచిపోయి యీనాడూ
పిరి పీల్చితి — మెంత స్వేచ్ఛ!!

భరతజాతి ఎన్నాళ్ళు
కిర్రు బిక్కిర్రియై నలిగెను—
వఱదలైన త్యాగంలో
దొరకెను స్వాతంత్ర్య ఫలము ||ఏ||

ఈనాడే ఈనాడే
ఈనాడే మన పండుగ ;
ఏడాదికి ఏడాదికి
ఏడాదికి ప్రతి ఏటా ||ఏ||



# స్వతంత్ర భారతం

తురగలించె కాంతిరేఖ
భరత జాతి మస్తకమున
పరిమళించె విశ్వంభర
ఇరువది ఆరవ జనవరి —

పెర రాచరికపు చాయలు
చిరిగి చిరిగి చెరగిపోయె
తరిగిన మన భారతమ్మె
పరిపుష్టమ్మై నిలచెను ॥తు॥

ఎలుగెత్తెను భారతమ్మె
వెలుగుల శంఖాల నొత్తి
విజయ దుందుభులు మ్రోసెను
ప్రజ కూర్చెను రాజ్యాంగం —

ప్రజలే పరిపాలకులై
సృజియించిరి అధ్యక్షుని—
తల గల దేశాలలోనె
తల యెత్తెను భారతమ్ము ||తు||

పిసరైనా తగ్గనిదీ
సిసలైనది స్వాతంత్ర్యం ;
విరచించి ప్రకటించిరి
ఇరువది యారవ జనవరి—





కుంకుమ తెలుపు ముదురాకుపచ్చ, యీ మూడురంగుల సమ
భాగములో భారత జాతీయ పతాక ముండవలెను. తెల్లపట్టీ
మధ్య నీలివర్ణములో చరఖా సూచకముగ ఒక చక్రముండ
వలెను. సారనాద్ సింహధ్వజ పీఠము మీద నున్న అశోక
ధర్మ చక్రమును పోలి యీ చక్ర ముండవలెను. తెల్లపట్టీ
వెడల్పునకు తగినట్లు యీ చక్రమును చిత్రించవలెను.
పతాకపు పొడవు మూడువంతులకు. వెడల్పు దామాయి
షీగా రెండు వంతులుండవలెను.

## మన జండా

ఎగరాలీ
ఎగరాలీ
ఎగరాలీ
మనజండా —
నిగనిగమై
ధగధగమై
జిగేల్ జిగేల్ మని
గగన సీమలో —

శాంతి అహింస
సత్యం వెలిగే
భారత జాతికి
ప్రతినిధిగా —

ప్రపంచ సభలో
విపంచిగా మన
భారత వాణి
పలకాలీ...

---

# భా ర త ప్ర ణా ళి క

నేతలం ని
ర్ణేతలం—
మన జాతికి మనమే
నేతలం
నిర్ణేతలం—

కాయ మనదీ
కొడవలి మనదీ—
గాయపడినా
కాయం మనదీ ॥ నే ॥

జాతి మతాల వి
చక్షణ లేనీ
మానవ న్యాయం
మన సూత్రం—
సమానావకా
శాల సృజించే

ప్రజాస్వామ్యమే
మనలక్ష్యం — ॥ నే ॥

ఒకటీ రెండూ
మూడూ నాలుగు
ఎన్ని ప్రణాళిక
లైతేనేం ? —
దారిద్ర్యానికి
గోరీ కడతాం
ధర్మ రాజ్యమే
స్థాపిస్తాం ॥నే॥



# జవహరులాల్

నవభారత నిర్మాతా!
జవహరులాల్ శాంతిదూత!
స్తవనీయమ్మయ్యె నీవు
ప్రవచించిన పంచశీల ||

అహరహమ్ము తారకమై
సహజీవన సిద్ధాంతం
చీనా రష్యా మొదలై
నానాదేశ వ్యాప్తం||

బుద్ధ యోగి దెపుడెపుడో
సిద్ధాంతం పంచశీల
ఉద్ధరించి, దేశమ్ముల
పద్ధతిగా తీర్చి తీవు —

అణువై ఉదజనియై మా
రణ దేవత సాగించే
రణార్భటి గొణుగువారె
అణగారెను దుష్ట మారి ||౧||



నవభారత నిర్మాతా!
జవహరులాల్ శాంతిదూత
స్తవనీయమ్మయ్యె నీవు
ప్రవచించిన పంచశీల ॥



భరతదేశం
పరిగణించిన
జాతి గీతం
జాతి రత్నం -

## రవీంద్రుడు

ఓ రవీంద్రా !
ఓ కవీంద్రా !
　　నీదె యోగం
　　నీదె భోగం—

భరత దేశం
పరిగణించిన
జాతి గీతం
జాతి రత్నం —

విశ్రుతించెను
విశ్వ భారతి
విశ్వ కవిగా
శాశ్వతముగా ||ఓ||

నీదు చిత్రం
నీదు గానం
నీదు కవనం
మోదమయ్యెను ||ఓ||

# భూ దా న య జ్ఞం

ఓ అన్నలార !

ఓ తమ్ములార !

ఒళ్ళుమఱచే నిదుర లేవండీ

కళ్ళు తెఱచీ మీరు చూడండీ||

పెట్టుబడిదారులై

పీఠాలు పెట్టుకుని

రవి యస్తమించనీ

రాజ్యమ్ము లేలినా

తెల్ల దొరలే వెళ్ళిపోయారూ

వెళ్ళలేకే వెళ్ళిపోయారూ ||ఓ||

గట్టి పట్టూ పట్టి

పట్టి విడువాలేక

పుట్టి ముంచుకువచ్చి

నట్టి సంస్థానాల

రాజులే కళ్ళప్పగించారూ

రోజులే మారె ననుకొన్నారూ ||ఓ||

కుంపిణీ దొరలకే
పెంపుళ్ళ బిడ్డలై___
ఉట్టి కట్టుకు తాము
ఊరేగుతామనే
చిట్టిదొరలే రైతులైనారూ
ఇట్టి రైతుల మీరు కన్నారా ||ఓ||

ఈ తెలుగు దేశాన
నే, తళుకు మెరిసింది
నాదమ్ము వినిపించు
భూదాన యజ్ఞమట
భావె తన కొంగునే పరిచాడూ
ఈవి గల వారలే యిచ్చారూ ||ఓ||

ఈ పృథ్వి కధికారి
గోపాలుడే నట
పల్లె పల్లెకు తిరిగి
వల్లించు నీ పాట
భూమిధర్మ భావేను విన్నారా
రామధర్మ భావేను కన్నారా ||ఓ||

# పొదుపు

పొదుపు చేయండీ
పొదుపు చేయండీ
అదనముగ వాడేది
అదుపు చేయండి—

క్రొత్త రాజ్యమ్మండీ
క్రొత్త కాపురమూ;
తాను ముక్కను బట్టి
గాను కుట్టాలీ.

కూడపెట్టిన పైస
మేడ కడుతుందీ;
కూడపెట్టని వాని
కూడెక్కడండీ॥



పైస పైసా కూర్చి
దేశాని కప్పిస్తే;
పెరుగుతుందీ ధనము
తరుగుతుందీ కరువు ॥

నదుల బంధించి, వా
రిధి వృథాపోనీని
జలముతో, సేద్య మా
కలి మంట నార్పాలి ॥



# ఖద్దరు

వడకవే వడకవే
వడకవే కదురా!
వడుకు నూలూ బట్ట
మడతలందీవే___

మెత్తన్ని పింజలో
నెత్తమ్మియెడదలో___
సాగి దారమ్ముగా
తూగి రాగమ్ముగా॥

వడుకు నూలూపిళ్ళు
పడుగులై పేకలై
బతుకుకత వల్లించు
గతి, నేతలో నిల్చు॥

బ్రతికి బట్టను కట్టు
ప్రతి జీవి ప్రతిరోజు,
గడియైన చేనూలు
వడుక తత్త్వము తెలియు॥



గోవిందుడే తాను

గోపాలకత దాల్చి

గీతామృతమ్మునే

పిండె........

# గో మా త

మా నందికేశ్వరుడు
మా వేంకటేశ్వరుడు
మా స్వామి గోస్వామి
మహిమ చూపాలీ—
మా భూమి సిరి సంప
దలను తూగాలీ...

ఒద్దికై నా యట్టి
ముద్దు ఎద్దుల జంట
పంటరైతుకు రెండు కళ్ళూ,
కళ్ళల్లో పెట్టుకొని
కాపాడితే వాని
పంటకళ్ళము పండు, పెల్లా ॥ మా ॥

భూమాత ఒకనాడు
గోమాత తా నౌచు
పృథువుకే ఓషధుల పిదికె,
గోవిందుడే తాను



గోపాలకతదాల్చి
గీతామృతమ్ము నే పిండె—

"గంగిగోవుపాలు
గంటెడైననుచాలు"
యోగి వేమన చెప్పినాడు;
కామితార్థము లిచ్చు
కామధేనువటంచు
ధన్వంతరియె పలికినాడు—

పంటరైతుకు పంచ
ప్రాణాలు గోజాతి
జాతి హింసకు పూనకండీ—
రైతుశాపాగ్నిలో
రగిలి భస్మముకాక
జాతీయతను తెలుసుకోండీ ॥ మా ॥

# నాగార్జున సాగరము

ముంచెత్తవే – కృష్ణ!
ముంచెత్తవే!
పాతకాలపు పూత
బౌద్ధ ప్రదేశమ్ము॥

పొంగి ఉవ్వెత్తుగా
రంగ తరంగాల,
నాగార్జునాచార్య
సాగరమ్మై నీవు॥

క్రమబద్ధముగ – విక్ర
మము డించి – ఓ వేణి!
పాయలై పాయలై
పఱవళ్ళు త్రొక్కుచును॥



కేదారములు పుణ్య
కేదారములు గాగ
జీవనమ్ములు నింపి
జీవనమ్ములె నిల్పి ॥ ముం ॥

మిసిమి తొణికింపవే !
పసిడి పండింపవే !
సహ్యాజానది ! నమ
స్కారమ్ములను గొనవె ॥



## లో క మా న్యు డు

మహారాష్ట్ర దేశాన జనించిన
మహా నాయకా! జోహారు!
మహాభారత ప్రతినిధి! ఓ మా
మహాతపస్వీ! జోహారు.

స్వరాజ్యమే మన జన్మహక్కని
నిరాఘాటముగ చాటావు;
పరాయిశక్తుల దౌష్ట్యం కెదురై
పరాక్రమించి నిలిచావు ॥ మ ॥

పురాణ సంస్కృతి నుద్ధరింప, నీ
నరాల సత్తువ నోడ్చావు;
నిర్మలమైన జాతీయతకై
కర్మయోగివై వెలిగావు ॥ మ ॥



అర్ణవమగ్నపు భారతీయులకు
కర్ణధారివై నిలిచావూ ;
లోకమాన్య గంగాధరతిలకా !
నీకు నమస్సులు లోకగురూ ॥





స్వరాజ్యమే మన జన్మహక్కని
నిరాఘాటముగ చాటావు ;
పరాయి శక్తుల దౌష్ట్యం కెదురై
పరాక్రమించి నిలిచావు ॥

# బాలగంగాధరతిలక్

భారత విప్లవ జనకా! జోహార్
బాల గంగాధర తిలకా ॥

పూరించిన నీ శంఖారావం
ఊరూరా మార్మ్రోగిందీ ॥

గణపతి పూజల సాగించిన నీ
కావ్యం రూపం తాల్చిందీ ॥

కర్మయోగివై గీచిన గీతను
ధర్మభారతం నడిచిందీ ॥

స్వతంత్ర భారతదేశమ్మిదె నీ
ప్రతాపమే కీర్తిస్తుందీ ॥

# వల్లభాయి పటేలు

వీరుడా! బార్డోలి
వీరుడా! ఓ
వీరాధివీర! మా
భారత కేసరి ॥

తెల్లవారల గుండె
ఝల్లుమనిపించె – నీ
వెల్లివిరిసినశక్తి
వల్లభాయిపటేల్ ॥ వీ ॥

చిల్లర సంస్థానాల
వల్లె యనిపించావు;
ఒక్కచూపుతోడ, దేశ .
మొక్కత్రాటి, లాగినావు ॥ వీ ॥



ఎక్కుచ్చి నీ మాట తీరు
ఉక్కుమనిసి వన్న పేరు
పేరు విన్నవారు
తారు శత్రులకెల్లి ॥

నిక్కచ్చి నీ మాటతీరు

ఉక్కుమనిసి వన్న పేరు—

పేరువిన్న చాలు

తారు శత్రులకెల్ల ॥వీ॥



# శాంతి సందేశం

ఓరోరి మానవ వినరా! నీ
మారణోద్యోగమ్ము మాన వదేరా ॥

హద్దుతప్పి నడుచు హక్కు నీ కెక్కడిది
యుద్ధాలు రెండైనా బుద్ధిలేదేరా ॥ ఓ ॥

హిరోషిమా నగర ఘోరమ్ము కన్నావు
మారణాస్త్రముపైన మనసు విడవేలా ॥

దానవత్వము తప్పుదారి పట్టించేను
మానవుడా! తెల్వి, మంట కలుపకురా ॥

పాపపుటూహాల పలుమారు భావింప
పాపకర్ముడ! నీకె ప్రాప్తించుగదరా ॥

శాంతరసము చిందు సాధుమూర్తులు ఋషులు
శాంతి శాంతియనిరి – సారమ్ముగనరా ॥ ఓ ॥

# ఆంధ్రమాత

జయ జయాంధ్ర మాతా!
మాతా!
జయ జయ జయ మాతా—
జయ దయాంచితా
జయ జయాంకితా
జయ జయ జయ మాతా॥

మాతామహి మా భారతమాతకు
ఖ్యాతి గడించిన పూతచరిత్రా—
నన్నయ రాయల కన్నతల్లి, నీ
వెన్నెల చూపుల కివె మా జోతలు ॥ జ ॥

రంగారు నదులే నిండీ
బంగారు పంటలె పండీ



బంగారు తల్లీ! నీలో
బంగారు గనులే, జాలై
అనుంగు బిడ్డల ననుగ్రహించే
తెనుంగు తల్లీ! దీప్తివల్లీ ॥ జ ॥



E.E.

# ఆయుర్వేదము

ఆయుస్సు కగు వేద
మభ్యసించాలి
ధర్మసాధక మైన
తనువు నిల్పాలి ॥

అల్పకాలిక జీవు
లల్ప మేధసులూ—
బ్రహ్మాయువుగ బ్రదుక
బ్రహ్మదేవుడు పలెక ॥

స్వస్థునికి ఆరోగ్య
సంరక్షణము సేయు
వ్యాధి ముక్తుండౌను
వ్యాధి పీడితుడు ॥

కాల కర్మమ్ములును
మూలికలు మంత్రాలు—

అన్ని ఆయుర్వేద
మందు కొల్లలురా ॥

వెలిగడ్డ నోషధుల
వెలిసి పోవును గుణము—
మనిసి పుట్టిన నేల
మందె వాడాలిరా ॥

దేశమంటే మట్టి
దేశమంటే మనిసి—
దేశీయ వైద్యమ్ము
తేజరిల్లాలీ ॥



# ఏ రు వా క

ఏరువా కొచ్చింది
ఏరువాకమ్మ
కొండలన్నీ దాటి
కోనల్లు దాటి ||

ఏరువాకమ్మకూ
ఎఱ్ఱన్ని పూలూ
బసవన్న కొమ్ములకు
పచ్చన్ని పూలు ||

కొట్టరే టెంకాయ
పెట్టరే పసుపు;
బొట్టు కుంకుమ పెట్టి
పెట్టి వడపప్పు ||

రోజురోజూ గోవు
పూజ చేసేమూ;
ఏడాది కొకమారె
కోడెలకు పూజ ||



సాగిరావమ్మ మా
ఏఱువాకమ్మ;
తూగి రావయ్య మా
పంట బసవయ్య ||

జంటగా రావయ్య
పంట బసవయ్య;
క్రొత్తగిత్తను నేడు
కాడి కలపాలీ ||

క్రొత్త బట్టలు నీకు
క్రొత్త పాలేర;
క్రొత్త గోచీ నీకు
కుఱ్ఱ పాలేర ||

క్రొత్త ఏటితో మనకు
క్రొత్త ఏడాది—
భూదేవి పండవే
గాదెల్ల పైకి ||

# పంట బసవన్న

మా కోస మీ ఏఱు
వాక వచ్చిందీ;
ఏడాది కేడాది
ఏఱువాకమ్మ ||

పున్నమను జ్యేష్ఠలో
పొంగింది ఏఱు;
కుప్ప తెప్పల పూలు
కొప్పులో ముడిచీ ||

బుసబుసల పొంగింది
బసవన్న ఒడలు;
బసవన్న కొమ్ములకు
పసుపు పూసేము ||

బసవన్న కొమ్ములే
పసుపు కొమ్ముల్లు;

పంకించు కొమ్ములకు
కుంకుమపు బొట్టూ

తలపాగ దించేము
తలలు వంచేము;
బిఱ్ఱైన బసవన్న
అఱ్ఱు వంచన్న ॥

టెంకాయ కొట్టేము
శంకరుని నంది!
అంకెకును రావన్న
అంకెల్లు మాని ॥

పన్నరా కోటేరు
పాలేరు బిడ్డా!
శకునాలు దొడ్డవీ
సాగి పోదాము ॥



దుగ్గిరాల గోపాల
కృష్ణుడా - సి
ప్రజ్ఞ నిరంకుశము
భారతయోధుడ ॥

# ఆంధ్రరత్న దుగ్గిరాల....

[శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు విద్యాపీఠ గోష్ఠికిని రామదండునకు వ్యవస్థాపకులు. జ్యేష్ఠ శుద్ధ చతుర్థి వారి జయంతి. అఖిలభారత జాతీయమహాసభా కార్యదర్శిగా పనిచేసినారు. కాకినాడ కాంగ్రెసు ఉత్సవములలో ప్రధానపాత్ర వహించినవారు. త్యాగమూర్తులు. ఆ కాలములో సీమకుపోయివచ్చి జాతీయతావాదులై కారాగారవాసము చేసిరి. జాతీయోద్యమమును రామదండుతో నడిపి కట్టకడపటిదినములలో ఇక్కట్టులబడి రామసాన్నిధ్యమును చేరిరి. ధర్మవీరులుగా వీరు నడిపిన జీవితములోని గాథలు పెక్కు ఆంధ్రదేశమున ప్రసిద్ధములు ]

దుగ్గిరాల గోపాల కృష్ణుడా
నీ
ప్రజ్ఞ నిరంకుశము – భారతయోధుడ ॥

తెలుగుజాతిని పుట్టినావు
వెలిగే జాతిరత్న మీవు
పలుకు వెలది పంట
పన్నెత్తితే చాలు ॥

చీరాల పేరాల ప్రజల
వేరు భూముల నిలిపినావు

సారథివై జాతి
సమరమ్ము సాగిన ॥

రామ నగరు కట్టినావు
రామదండు నిలిపినావు
రామభజన చేసీ
రాళ్ళు కరగించావు ॥

కవ్వించి నవ్వించు తీరు
నిప్పు
రవ్వనందు నిల్పు సౌరు
నీకే నీకె చెల్లె
ఏ కాల మే తావు ॥



## విశాలాంధ్ర

విశాలాంధ్రమే
విరిసించీ
దిశాతటమ్ముల
మెరసించీ ॥

ఏమి శతాబ్దా
లెడబాటైనను
చిమ్మచీకటిని
చీల్చి తెమల్చుకు ॥ వి ॥

తెలంగాణలో
జ్వలించు దీపం
ఆంధ్రావనితో
అఖండమై ॥ వి ॥

కోర్కె తీరెను
కోటి ప్రజాళికి
భాగ్యనగరి సౌ
భాగ్యము నించెను ॥ వి ॥

# చే నే త

[ భారతదేశమున కుటీర పరిశ్రమలలో చేనేత ప్రధానమైనది. విదేశీయులను సైతం మాకర్షించి పెక్కు పేదలైన పనివారికి ఉపాధి కల్పించుచున్నది. అందుచే చేతిపరిశ్రమకు ప్రతినిధిగా చేనేత అనుశీర్షిక ఎన్నుకోబడినది. చేనేతవారు 'భరతదేశపు నేతపనివాడా' అనియును పాడుకొనవచ్చును ]

భరతదేశపు చేతి
పనివాడా
పరిమళించిన కీర్తి
కలవాడా ||

పేరాస లేదోయి
పెట్టుబడి లేదు
నీ చేతి పనిముట్టు
నీ జీవికకు పట్టు || భ ||

మర శూర్పణఖ కీవు
ఎరకాని రాముడవు
నీ చేతి పనిముట్టె
నీకు సీతమ్మ || భ ||

నీలోని జీవమే
నీ కళకు జీవమై
నీ మనసు కళ పండి
నిండు పున్నమ వెల్గు ॥

పనితనము వెలయించి
బ్రహ్మసృష్టిని మించి
నీలోనె నీవె వ
ర్ణించి ఆనందింతు ॥ భ ॥

కందమూలమ్ము లా
కలికి నై భక్షించు
పర్ణశాలల ఋషుల
బ్రతుకు జీవిక నీది ॥

భరతదేశపు చేతి
పనివాడా
పరిమళించిన కీర్తి
కలవాడా ॥

## సహకారము

సహకార ముద్యమము
సాగిపోవాలీ
సహకారమున విశ్వ
శాంతి కలగాలీ ॥

సంఘమ్ముతో వ్యక్తి
సంఘమ్ము జాతితో
జాతి కింకొక జాతి
సహకార మది లెస్స ॥

బక్క-చిక్కి-నవాని
డొక్క నెత్తురు పీల్చి
ఇరుగు పొరుగయి స్వార్థ
పరత బలియగ రాదు ॥

సర్వజనులకు సుఖము
సహకారమున గలుగు
భూతదయ యిం దను
స్యూతమ్ము పూతమ్ము ॥

సంఘమ్ములో నరుడు
సౌకర్యముల నందు—
వెలినున్నవాడు, కే
వల మాను దవ్వగా ॥

సహకార ముద్యమము
సాగిపోవాలీ
సహకారమున విశ్వ
శాంతి కలగాలీ ॥



# వనమహోత్సవము

[ సప్తసంతానములలో ఆరామప్రతిష్ఠ ఒకటి. వృక్షములను ఓషధులుగా బ్రహ్మ సృష్టించెను. మానుమరుందయి మందగునని భాషాశాస్త్రవేత్తలును చెప్పుదురు. కొన్ని ఓషధులను తీయునప్పుడును గ్రహణకాలములో ఆరాధించి తీయుదురు. వేపచెట్టు అమ్మవారని మానిపూజ చేయుదురు. రావిచెట్టు తానేనని కృష్ణపరమాత్మ అర్జునునికి బోధచేసినాడు. రావిచెట్టును వేపచెట్టును కలిపి వివాహము చేయుదురు. సంతానముకోరువారు వానికి ప్రదక్షిణింతురు. బుద్ధునికిని ఒకానొక వృక్షము నీడనే తెలివికలిగినది. స్వర్గములోని నందనవనము సుందరమైనది. కామధేనువువలె కల్పవృక్షమును మనకు ప్రసిద్ధమైనది ]

ఓరి మానవుడా
ఓరి మానవుడా
చే యెట్టు లాడురా
చెట్టు కొట్టకురా ॥

వంశమే వృక్షమను
అంశమ్ము గనరా
మూడు పూవులు ఆరు
కాయలై బ్రతకరా ॥

అదునులో వర్షాలు
పదునులో సేద్యాలు
వృక్షజాతిని పెంచ
అక్షయమ్మురా పంట ॥

తెలియరా చెట్లలో
దేవతా వృక్షాలు
తెలియరా నీలోని
దేవతాత్మనుకూడ ॥

పూల కాయల పండ్ల
పులకరించును మనసు—
బ్రతుకె నందనమైన
వనము నిర్మింపరా ॥



# కాశ్మీరు

కండలో కండరా
కాశ్మీరూ ;
గుండెలో ప్రాణమ్ము
కాశ్మీరూ ॥

భరతదేశపు రాజ్య
పరిధిలో ప్రాంతమ్ము—
ప్రజ కోరి వరియించి
భరతమాతకు మ్రొక్కె ॥

అందాల కోన, ఆ
నందాల దోనె రా !
నాకమే జారిచిన
నందనోద్యానమ్ము ॥

భరతమాతృ కిరీట
మాణిక్య దీపమ్ము

భారతీ పీఠమ్ము
పరమ పూజ్యమురా ॥

కన్యాకుమారి పే
షణపు దారుల సిరుల
బరపించి చూచు – నా
భారతీ పీఠమ్ము ॥

కండలో కండరా
కాశ్మీరూ ;
గుండెలో ప్రాణమ్ము
కాశ్మీరు ॥



# గోవా

బుడతకీచులు లేచి
పొండయ్యా ! మీ
ఉడతగంతులు చాలు
లెండయ్యా ॥

వలసమంత్రం పాటి
తప్పిందీ – మీరు
పట్టి నూరే రెంత
జెట్టీలూ ॥

లండనూ పారిస్సు
కంటేను – మీరు
గుండ్రంగ ఏమైన
ఉన్నార ?

సత్యాగ్రహుల పట్టి
కాల్చారూ – మీ
సభ్యతను లోకాన
చాటారు ॥

## భారత చైనా

ఆలోచించారా – మీరు
ఆలోచించారా ॥

స్వాతంత్ర్య భారత
పౌరుల్లారా !
చైనాదేశపు
చరిత్ర సంగతి ॥

భారత చైనా
ప్రజాకోటి, మన
ప్రపంచ మైదిట
రెండు వంతులని ॥

ప్రధాన మత మా
చైనాలో మన
తథాగతుని సి
ద్ధాంతమ్మేనని ॥

చరిత్ర మొదలుగ
సరిహద్దగు - ఇరు
జాతుల కెన్నడు
ఘర్షణ లేదని ॥

కలిసికట్టుగా
తొలిగా మనతో
పంచశీల ప్రే
మించి నిలచెనని ॥

ఆలోచించారా ?
మీరు
ఆలోచించారా
భారతదేశపు
పౌరుల్లారా !
చైనాదేశపు
చరిత్ర సంగతి ॥

---

## ఆ సి యా

నిద్దుర లేచిం
దాసియా - మరి
ముద్దర వేస్తుం
దేషియా ॥

రాచరికమ్ముల
రచ్చల్లో
వద్దన్నా - మరి
కద్దన్నా ॥

తన ప్రాచీనపు
ఘన వైశిష్ట్యం
తన ఔన్నత్యం
తానె స్మరించును ॥

వలసపద్ధతికి
ప్రబల విరోధి

అణ్వాయుధముల
కామడదూరం ॥

పంచశీల ప్రవ
చించిన ఖండం
పంచ ఖండముల
మించిన ఖండం ॥

ముద్దర వేస్తుం
దాసియా – పెను
నిద్దుర లేచిం
దేషియా ॥



## ప్రపంచ రాజ్యం

మానవులంతా
ఒక దేశం
మానవులంతా
ఒక రాజ్యం॥

ఏదేశానికి
ఆ దేశం
ప్రాజ్యం రాజ్యం
స్థాపించీ—
ప్రపంచ మానవ
రాజ్యాంగంలో
భాగస్వామిని
కావాలీ॥

విశ్వశాంతియే
మన లక్ష్యం;
విశ్వశ్రేయం
మన ధ్యేయం—

పంచశీల సి
ద్ధాంతముతో
ప్రపంచరాజ్యం
నడవాలీ ॥

రక్తం రంగూ
భేదం లేదవి
భక్త కుటుంబం
మన రాజ్యం—
పొర పొచ్చెమ్ములు
రాయబారముల
పరిష్కారమై
పోవాలీ ॥

అన్ని దేశములు
అర్పించండీ
అధికారం
ఒక కొంత—



వర్ధిల్లాలి
ధర్మస్థానం
వర్ధిల్లాలి
ప్రపంచరాజ్యం ॥



# ఆత్మ పరీక్ష

పుట్టినావి భరత
దేశాన – చేత
పట్టినావా గీత
ఎపుడైన ॥

రామరాజ్యం పేరు
చెబుతావు – నీవు
రామాయణమ్మెంత
చదివావు ?

భారతీయుడ నేనె
అంటావు – నీవు
భారతం సగమైన
చూశావ ?

భగవంతుడే తత్వ
మంటావు – నీవు

భాగవత శుశ్రూష
చేశావ ?

జాతి నడిపిస్తాను
అంటావు – నీవు
జాతీయతాదీక్ష
పొందావ ?



# దసరా

హనుమన్నవై నీవు
రావోయీ
అర్జునుండవై నీవు
రావోయీ ॥

బుల్లివాడా! లేచి
రావోయీ – పెద్ద
పిల్లవాడా! లేచి
రావోయీ ॥

హనుమన్న లంఘించె
మున్నీరు;
అంతమందెను సీత
కన్నీరు ॥

అర్జునుండే విల్లు
పట్టాడు ;
అమ్ముతో వైరులను
కొట్టాడు ॥




హనుమన్నవై నీవు రావోయీ

అర్జునుండవై నీవు రావోయీ



నవరాత్రములు పూజ
చేయాలి
నవజీవనము నింపి
రావోయీ ॥

అమ్మవారికి పూజ
చేయాలీ
జమ్మిచెట్టుకు పూజ
చేయాలీ ॥

అయ్యవారికి మ్రొక్క
రావోయీ
ఆయుధమ్మును పట్టి
రావోయీ ॥

బుల్లివాడా! లేచి
రావోయీ – పెద్ద
పిల్లవాడా! లేచి
రావోయీ ॥

## దీపావళి

దివ్వె దివ్వెము
ట్టించండీ;
దీపావళి వె
లిగించండీ—

శంభో హరహర
త్రిపురహరా
శంకర! యని మీరు
సాగండీ॥

పరమ సాధ్వులను
చెఱ పట్టీ
మరణించెను నర
కాసురుడే—

సత్యభామలై
రారండీ

సత్యావ్రతులై
రా రండీ ॥

దివిటీలను చే
పట్టండీ
దిశాంతమ్ములను
వెదకండీ

అధర్మమును గా
లించండీ
అధఃకరించీ
నిలవండీ ॥

ప్రమదప్రమిద ము
ట్టించే వెలుగే
భారతదేశపు
ధర్మజ్యోతి—

అఖండ భారత

పౌరుల్లారా

అఖండదీపం

నిలపండీ ॥

దివ్వే దివ్వే ము

ట్టించండీ

దీపావళి వె

లిగించండీ ॥



## సందేశం

దిద్దుకోండి యీ
దేశాన్ని - సరి
దిద్దుకోండి మీ
రాజ్యాన్ని—

బాలుల్లారా
బాలికలారా
భారత భావి
పౌరుల్లారా!

పలికే దంతా
పరమ సత్యమూ
భావించండీ
దీవించేమూ ॥ ది ॥

తెలుగుదేశ మని
మలయాళ మ్మని
అరవల నా డని
పొరుపులు పెంచీ—

తుండెములో ప్రతి
కండ కండ తెగి
పోయే బుద్ధులు
పోక మారలూ ॥ ౭ ॥

నువ్వా నేనను
భేదం కాకా !
ఎవ్వరు గెలిచా
రీ దేశం ?

పురాచరిత్రను
స్మరించుకోండి
తిరిగి తిరిగి పొర
పాటేనా ?॥

లాఠీలకు తల
పోటీలిచ్చి
గుండుదెబ్బలకె
గుండెల నిచ్చి

చచ్చిన వారి
త్యాగం పై
వచ్చిన రాజ్యం
మన రాజ్యం ॥ ది ॥

ఆలీబిడ్డా
తల్లీ తండ్రీ
అందరి కెడమై
ముందరి అడుగై ;

భారతవీరులు
పోరున నిల్చి
చిందిన రక్తం
మీ కోసం ॥ ది ॥

అందరి దొకటే
ఒక భాషా
అందరి దొకటే
ఒక జండా :

అందరి దొకటే
ఒక దేశం ;
భారత దేశం
మనదేశం ॥

దిద్దుకోండి - యీ
దేశాన్ని - కను
లద్దుకోండి - యీ
రాజ్యాన్ని

బాలుల్లారా
బాలికలారా
భారతభావి
పౌరుల్లారా ॥



# ప్రజా ప్రభుత్వం

నిద్దురపుచ్చీ
పెడుతుందా ? మరి
ముద్దా కలిపీ
పెడుతుందా ?

ప్రభుత్వమంటే
ఎవరండీ ?
ప్రజలూమీరే
కదసుండీ ॥

తక్షణమే ఫలి
యిస్తాయా ?
లక్షలాది మన
కోరికలూ

కావాలసి మీ
రంటేనూ ;
కళ్ళెం మీరే
పట్టండీ ॥

పరికరమ్ములే
యిస్తారో—
మరి మరి ధనమే
యిస్తారో

నెరవేరును మీ
పనులన్నీ,
అరభాగం మీ
రిస్తేనూ ॥

కాదని లేదని
అంటారా
కాయకష్టమే
చేయండీ—

కండలు కరగీ
పోవండీ – మీ
కొండలు తరిగీ
పోవండీ ॥



స్వతంత్ర భారత
రాజ్యంకోసం
సర్వత్యాగం
చేశారూ

స్వతంత్ర భారత
రాజ్యంలోనూ
శ్రమించలేరా
యీపాటీ !!

ముద్దా నోటా
పెడుతుందా – మరి
నిద్దుర పుచ్చి
పెడుతుందా ?

ప్రజలూ మీరే
కద సుండీ !
ప్రభుత్వమంటే
యీనాడూ !

## భారతి

చెప్పేడుమాటల వినకండీ - మీరు
తప్పుడు త్రోవల పడకండీ
వినకండీ వినకండీ
పడకండీ పడకండీ ॥

చిన్నల్లారా!
పెద్దల్లారా!
ఉన్న నిజాన్ని
మన్నించండీ—

అచ్చమైన మీ
యెడదల్లో,
మచ్చ మిగిల్చే
చిచ్చు రగిల్చే ॥ చె ॥

ఉత్తరాది యని
దక్షిణాది యని
ఉత్తరించు పని
కత్తిరించుడీ—

ఆర్య ద్రావిడ
మంతా ఒకటే—
అంతా ఒకటే
ఆర్యావర్తం ॥

దాక్షిణాత్యుడై
దీక్షవహించిన
శంకరు భాష్యపు
హుంకారానికి,

ఉత్తరభారత
మే మందీ - ని
రుత్తరమై తల
దాల్చింది ॥

సంస్కృతమ్మే మన
జాతి పాదపం—
శాఖశాఖలై
సాగి ఫలించే



భారత భాషలు

వర్ధిల్లాలీ ;
వర్ధిల్లాలీ
మన హిందీ ॥



## గురుపీఠం

వెనుకటి వాడవు
కావోయీ – నీవు
మునుపటి వాడవు
కావోయీ ॥

భారతదేశపు
ఔరసుడా !
స్వతంత్ర భారత
శాసకుడా ॥

పలికే పలుకూ
పాడే పాటా
వ్రాసే వ్రాతా
ఆడే ఆటా

వినిపిస్తోందీ
కనిపిస్తోందీ ;
ప్రపంచమంతా
పరికిస్తోందీ ॥ వె ॥

మాటికి చీటికి
చూస్తున్నారు
మంచీ శబ్బర
గమనిస్తూ—

పాటతప్పకా
ఆటతప్పకా
పాడర ఆడర
భారతిని ॥

కర్మవీరుడవు
పదవోయి—నీవు
ధర్మజ్యోతీ
వెలిగించీ—

భారతదేశం
మనదేశం ;
ప్రపంచానికే
గురుపీఠం ॥

## పురోగమనం

ఆచివేయరా!
తూచివేయరా!
ఆచితూచివేయరా
అడుగు ముందడుగు ॥

త్వరితగతిని సాగించే
భరతదేశ వీరుడా!
పరవశాన పరుగులిడే
భరతదేశ పౌరుడా!

ఆచీ తూచకపోతే
అడుగు తబ్బిబ్బైతే
సంగనాచి దొంగనాచు
లుంగచుట్టేస్తుంది ॥ ఆ ॥

ముందడుగున తొందరైతే
బంద బాడి లంపటమై

పడితే, దిగబడితే – పొర
బాటు పెద్ద పాటగురా!

పూలసెజ్జకాదు – ఉ
య్యాల పరుపు కాదు, వి
య్యాల విందుకాదు – గం
డ్రాల గుట్ట రాచరికం ॥ ఆ ॥



## ఆకాంక్ష

జయ జయా జయ జయా
జయమంగళం
జయమంగళం నిత్య
శుభ మంగళం ॥

మా భరతమాతకు
మా జగజ్జననికి ॥

గంగా తరంగిణీ
సంగీత ఝురులతో
దివ్యమంగళగీతి
తేలి పోనీవోయి
అమృత సందేశమ్ము
నందింప వోయీ ॥ జ ॥

కంచి కామాక్షమ్మ
మధుర మీనాక్షమ్మ

కనకదుర్గాదేవి
కనికరించాలీ ;
అన్నపూర్ణాదేవి
అవధరించాలీ ॥

కాశికా విశ్వేశు
కనుతుదల సంపదల
రామలింగస్వామి
రమణీయ దృక్కులో
భారతము శక్తి సం
భరితమై పోవాలి ॥ జ ॥

## స తి

అమ్మా భారతీ
కైకో
నమ్మా హారతి!

గుమ గుమ గుమగుమ
జబిలి మల్లియల
దండల నీ కను
పండువు చేస్తా - లే
గులాబీల ని
న్నలంకరిస్తా ॥ అ ॥

గమ గమ గమ గమ
కస్తూరి తిలకం,
నెన్నుదుటను నే
తీర్చి దిద్దుతా - పై
పునుగు జవాదులె
పూయిస్తా ॥

కంఠాభరణం
కంకణయుగళం,
పసందు టందెలె
చేయిస్తా - మై
పసిండితో తుల
తూగిస్తా ॥

కాలి తామరల
కాంతిచ్ఛట నా
యెడంద వెల్గులె
జోడిస్తా - నీ
లోని వీణియ
పలికిస్తా ॥

తత్తళంగు తక
తద్ధిమి త్రై త్రై;
నీవే నేనై
నృత్యం చేస్తా - ఉ
ఱ్ఱూచి జాతిని
నడిపిస్తా ॥



నిలోని విజయ

పలికిస్తే

నమ్మా భారతీ !

—రచయిత

# గేయ సూచిక



41 ప్రపంచ రాజ్యం
42 దసరా
43 దీపావళి
44 ఆత్మపరీక్ష
45 సందేశం
46 ప్రజాప్రభుత్వం
47 భారతి
48 గురుపీఠం
49 పురోగమనం
50 ఆకాంక్ష
51 నతి

ఆంధ్ర పత్రిక, ఆంధ్ర ప్రభ, కృష్ణాపత్రిక, జాగృతి, స్రవంతి, ప్రజావాణి, ప్రజాసేవ, ప్రజామత, ఆంధ్రప్రదేశ్, తెలుగుదేశం, గుంటూరు పత్రిక, వాహిని, ఇండియన్ మెడిసన్, దేశసేవ, పాడి పంటలు, హితవాది మొదలైన పత్రికలలో కొన్ని గేయములు ప్రకటింపబడినవి. ఏతత్ సంపాదకులకు నా కృతజ్ఞతాభివందనములు.

| | | బేసరి | సరి |
|---|---|---|---|
| పేజీ | 19 | కమ | కను |
| | | చేదా | లేదా |
| | 22 | మతములో | మతముతో |
| | 32 | రణాసి | రాణసి |
| | 106 | చీచ్చు | చిచ్చు |

# కొన్ని పండుగలు



| | | |
|---|---|---|
| 1 | నేతాజీ జయంతి | - జనవరి - 23 |
| 2 | స్వతంత్ర భారతము | - జనవరి - 26 |
| 3 | చేనేత (3వ వారం) | - ఫిబ్రవరి - |
| 4 | భారత చైనా పంచశీల | - జూన్ - 28 |
| 5 | వనమహోత్సవము (మొదటివారము) | - జూలై - |
| 6 | తిలక్ జయంతి | - జూలై - 23 |
| 7 | రవీంద్ర జయంతి | - అగస్టు - 8 |
| 8 | స్వేచ్ఛా భారతం | - అగస్టు - 15 |
| 9 | గాంధీ జయంతి | - అక్టోబరు - 2 |
| 10 | యు. యన్. ఒ. డే | - అక్టోబరు - 24 |
| 11 | నవభారతోత్సవము (ఆంధ్రా ప్రదేశావతరణము) | - నవంబరు - 1 |

| | | |
|---|---|---|
| 12 సహకారోత్సవము (మొదటివారములోని శనివారము మొదలు) | - | నవంబరు- |
| 13 జవహరు జయంతి | - | నవంబరు – 14 |
| 14 పతాకోత్సవము | - | డిశంబరు – 7 |
| 15 పొట్టి శ్రీరాములు జయంతి | - | డిశంబరు – 15 |
| 16 వల్లభాయి జయంతి | - | డిశంబరు – 15 |
| 17 బుద్ధ జయంతి | - | వైశాఖ పూర్ణిమ |
| 18 ఆంధ్రరత్న జయంతి | - | జ్యేష్ఠ శుద్ధ చతుర్ధి |
| 19 దసరా | - | అశ్వయుజ శుద్ధ దశమి |
| 20 దీపావళి | - | అశ్వయుజ బ॥ అమావాస్య |
| 21 గోపాష్టమి | - | కార్తిక బ॥ అష్టమి |
| 22 ధన్వంతరి జయంతి | - | కార్తిక బ॥ త్రయోదశి |
| 23 గీతా జయంతి | - | మార్గశీర్ష శుద్ధ ఏకాదశి |

# జాతి - రచయితలు



ఉప రాష్ట్రపతి

## డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణయ్య

(భారత రాజ్యసభాధ్యక్షులు)

భారతదేశంలోని ముప్పది యారుకోట్ల ప్రజల లోను ఆ మందరును ఒక్కటే యను భావము కలుగచేయుట తమ లక్ష్యముగా రచయితలు భావించవలెను. తన విధానములో ప్రతి ఒక్కరును కళా కారుడే. ఒకరు కావ్యముల రచించిన మరియొకరు అచ్చువేయుదురు, ఇంకొకరు బైండుచేయుదురు. మన మందరమును కలిసికట్టుగా ఎంతయో జాగరూకతతో కృషిచేసిననే మనకు సత్ఫలితము కలుగును.

రచయిత మనస్సు నిష్కళంకముగా నుండవలెను. జీవితములో అనుభూతి ఉండవలెను. పదముల కూర్పు లో నేర్పుగలిగి యుండవలెను.

మన దేశములో ప్రస్తుతము ఆర్థికరంగములో విప్లవాత్మకమైన మార్పులు చేయవలెనని ఉద్దేశించినాము. అందువల్ల ప్రజల దృక్పథములో సైతము మార్పు రావలెను. ఇందుల కనుగుణముగ రచయితలు తమ దృక్పథమును మార్చుకొని ప్రజలదృష్టిని మార్చవలెను. ఈ మధ్య దేశములో చెలరేగిన ప్రదర్శనములు, అల్లరులు జాతి ఐక్యత యొక్క ఆవశ్యకతను ఋజువుచేసినవి. ఈ విధానములోనుండి రచయితలు గురుతరబాధ్యతను వహించవలసి యున్నది.

దేశ ఐక్యతకు విఘాతము కలిగించు విధానములను పారద్రోలి జాతి నిర్మాణమునకు రచయితలు అంకితము కావలెను:

[ 6 – 11 – 56 న పుస్తక ప్రచురణకై బహుమతులను ఇచ్చుటకు సాహిత్య ఎకాడమీ వారు ఏర్పాటుచేసిన సభలోని ఉపన్యాస పాఠము ]



భారత ప్రధానమంత్రి

# శ్రీ జవహరులాల్ నెహ్రూ

## జాతీయ రచయితలు - ప్రపంచశక్తి

ప్రపంచములోని ప్రాచీన మహాకావ్యాలన్నిటిలోను పరిపూర్ణమైన చిత్తశుద్ధి ఉట్టిపడుతూ ఉంటుంది. ఏ సత్యాన్ని రచయిత దర్శించాడో ఆ అనుభూతిని పాఠకుడికి అందించే యత్నమే చిత్తశుద్ధి. కావ్య నిర్మాణమున కవసరములయిన ఉదాత్త వస్తుగ్రహణము కల్పనాశక్తి రచనా సౌష్ఠవముకంటె ఇది మిన్నయైనది.

దైనందినాల్ప సంఘటనములకు రచయితకలవరపడరాదు. వాని కంటక వస్తుదృష్టితో మాత్రమే వాటిని శాంతముగ చూచే స్థితిలో రచయిత ఉండాలికాని, సామాన్యంగా రాజకీయవేత్తవలె ఉద్రేకంతో ఊగిసలాడరాదు. రచయితలు వారి వారి దేశప్రజల అంతః ప్రవృత్తి, ఆదర్శము, దీక్షలకు ప్రతి రూపాలుగాఉండాలి. పరస్పరం అభిప్రాయాలు గ్రహించి చక్క దిద్దుకోవడానికి, సత్యాన్వేషణాశక్తి పెంపొందించుకోవడానికి, భిన్నదేశరచయితల పరస్పరసమాగమం అభిలషణీయం.

ఒక మహావృక్షం పాదు ఒకచోటనే ఉన్నా - శాఖలు విస్తరించి పుష్పసౌరభాన్ని నలుదెసలా పంచారించినట్లే; ఒక ప్రదేశంలో జన్మించిన రచయిత దిగంతాలకు విజ్ఞాన సౌరభాన్ని వెదజల్లవచ్చు.

ప్రపంచంలో రాజ్యాలన్నీ చాలా వఱకు ఒక అంతర్జాతీయ రూపాన్ని పొందాలని ప్రయత్నిస్తున్నా, రూపంతాల్చడం అనేది క్లిష్టతరమవుతోంది. ఈ సందర్భములో రచయితల పాత్ర ఏమిటి? ఈ మహా కార్యానికి ఉన్ముఖంగా, శక్తిమంతంగా, రచయితలు - ప్రపంచ ప్రజల అభిప్రాయాన్ని తీర్చిదిద్దగలరనీ, వలెననీ - నా అభిప్రాయం. ఇంతకీ మనస్సే కదా సంకల్పాలకూ సంఘటనములకు మూలభూతమైనది!

యునెస్కో నియమావళిలో మనుష్యుల బుర్రలలో నుండి యుద్ధాలు మొలుచుకు వస్తాయని ఉంది. అది కచ్చితంగా నిజం. ప్రజల మనస్సులపై రాజకీయవేత్తలు ఒక రూపంలో తిష్ఠవేసుకోయత్నిస్తారు. కాని బహుముఖరచనా ధురంధరులైన కవీశ్వరులు వారి మనస్సులపై శాశ్వత పీఠాన్ని స్థాపించుకుంటారు. అది సమంజసముకూడా.

[ది 29-12-56 న్యూఢిల్లీలో ఆసియా రచయితల సభాసమాప్త సందర్భంలో శ్రీ కార్లోభావి అధ్యక్షతను జరిగిన ప్రపంచ రచయితల రౌండు టేబిల్ సమావేశంలో శ్రీ నెహ్రూ ఉపన్యాస పాఠము.]



విద్వాన్

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## కావ్యమాల



| | |
|---|---|
| నృత్యభారతి (నృత్యగీతములు) | 1 0 0 |
| ఉషాసుందరి (నాటకము) | 1 8 0 |
| జాతీయభారతి (గీతావళీ) | 2 8 0 |
| | 5 0 0 |

ప్రతులకు :

పైడిపాటి సుబ్బరామశాస్త్రి,

మారుతీనగర్

విజయవాడ



జమ్ము కాశ్మీర్
రాజస్థాన్
నేపాల్
భూటాన్
అస్సామ్
బీహార్
మధ్యప్రదేశ్
పశ్చిమ బెంగాల్
ఒరిస్సా
బొంబాయి
మైసూర్
మద్రాస్
శంకర! శంకర! త్రిపుర హర! శంకర! యని
ప్రమద ప్రమిద ముట్టించె వెలు
భారతదేశపు ధర్మజ్యోతి
అఖండ భారత పౌరుల్లారా
అఖండదీపం నిలపండీ
జాతీయ భారతి
అమ్మా భారతీ! కైకోవమ్మా